—సంపెంగపువ్వుగుత్తి—

చ. ప్రకటితహేమవర్ణమున వన్నెవహించితి రమ్యసౌరభా
ధికతను గాంచి మించితివి; తెల్విధరించితి వైన మానుగా
సకలలతాంతవాసనలు సారెకు నానుమిళిందరాజ మెం
దుకు నినుఁ జెందదో మదినిఁ దోఁపదు చంపకసూనవల్లరీ! ౧౨౭

—దుష్టచిత్తము—

చ. నిలుకడ లేదు సుంతయును నీతియు సున్న గుణంబు నాస్తి చా
పలమది మెండు; కోరిక లపారము లెన్నఁ; బరాంగనాధనం
బులపయిఁ గాంక్ష హెచ్చు, హరిపూజలటన్న హుళక్కి; గాఁక ని
చ్చలుఁ గడుదుర్గుణంబుల వెసం దొరకొంటివి దుష్టచిత్తమా. ౧౨౮

—బాల్యావస్థ—

ఉ. ప్రగ్గడలున్నచోట భయభక్తుల నెంతయుఁ గల్గనీయవా
యగ్గియుఁ దుష్టపురుష్వులను వంటఁగరాదనుబుద్ధి నీయవా
మొగ్గగుమాటలం బనుల నన్నిట వన్నెగఁ జేయుచుండువా
సిగ్గులుగంగనీయ విటుఁ జెన్నుగ నన్నిటఁ జిన్నప్రాయమా! ౧౨౯

—గర్వము—

చ. అనువుగ మానవుం డనువ వర్థముఁ జెప్పఁగనేర డెంతయున్
ధన మొకఁ గూర్చి మానవలెను దానముధర్మము సేయలేవు జ
వ్వనమును గల్గి మానవలెను బాహుబలంబును జూపలే డటం
చును బయివారిసంగతిని జూడక యూరక పోవు గర్వమా! ౧౩౦

—కామము—

ఉ. వాలికఁ జెంప వింతయును వర్తనముం బరికింప నెంతయున్
వావిరి కీర్తిసంపదలుఁ బాయును దీన నటంచు నెంచ వీ
త్రోవలఁ గీడుమూడునని దూరముగాఁ దలపోయ విట్టిదు
ర్భావమున న్నటించు నినుఁ బాయుమి క్రోధము బాయఁ గామమా! ౧౩౧

—మత్సరము—

చ. సిరిసిరవొందె, సంతతినిఁ జెందెను; బల్మియు నీగి కల్మియున్
దొరకొన రూపవైభవముతోఁ దులఁదూఁగెను సర్వవిద్యలన్
మెలఁగెను వీరి దేమి యని మేరకుమీఱి నసూయనెంతయున్
నెలకొలుపు వీనిలో నొకటి నీకొనఁగూడునె మత్సరాధమా! ౧౩౨

—శాంతము—

చ. తులువలు గూడి వేడుక నుతుల్ రచియించిన, లీల హేళనో
క్తులఁ బచరింప నాని యని కొందఱు పామరు లండఁ జేరి యు
వ్వల నలకచ్ఛకొంగుఁగొని బాగుగలాగుచు నుండ న త్తఱిం
దలఁపున కోపమూతనిని దాఁకదు నీకృపచేత శాంతమా ! ౧౩౩

—ధైర్యము—

ఉ. వారక నాకసం బొరగి పైఁబడుచుండుటఁ జూచుచుండియున్
వారిధి మేరమీఱితనవంకకుఁ జేరుట గాంచుచుండియున్
ధారుణి గ్రుంగిపోవ నలదారుణలీలను గాంచుచుండియున్
పారకు నిశ్చలంబుగను జల్పదు మానసవృత్తి ధైర్యమా ! ౧౩౪

—ఆశీర్వచనము—

క. ఆధియు వ్యాధియు లేనియు, బాధియు నెవ్వదియుఁ గాంచి యర్థులకోర్కుల్
సాధునఁ బూరించుచు నీ, వీధరణిన్ మనుము చిరము విద్యచరిత్రా !

—శ్లోకములు—

యస్యసంభవతి జన్మపత్రికా యాసు భాధికఫలప్రదాయినీ
ప్రోజ్జ్వలం భవతి తస్యజీవితం దీపయుక్తమివ మందిరం నిశి. ౧౩౫
విదుషాంతు ముదే నిజస్వరూపా గరుడాంకస్య ముదే గతోపరూపా
గిరిశస్య ముదే సదాపరూపా ప్రతిభాతీ త్యుపమైవ నైకరూపా. ౧౩౬
అకారణోజ్జృంభితసత్కృపారసాత్సుధీజనా శ్శస్య ముదం నజాయతే
సుధాసుధాంశోరివ యస్యసన్ముఖే విరాజతే వాఙ్మధురా సుశీతలా. ౧౩౭
నారాయణాయ నళినాయతలోచనాయ నాకాధిపప్రముఖనిర్జరసన్నుతాయ
శ్రీమానినీహృదయసారసలోలమత్తభృంగాయ భక్తవరదాయ సదా నమస్తే.

—వావిధములచే యోగినిబల్కుట—

ఉ. ధారుణి జారిణీధవులు దంపతులైరి విధిన్ సుయోగినీ
భారతిచేత భర్తనది వాసి స్వభర్తకు పాంసులాంబకున్
దీరుగఁ గల్గుపుత్రుఁగని దేవర ! సోదర ! మామ ! యల్లుఁడా !
దారక ! తండ్రి ! పౌత్ర ! యని తానలయోగిని బల్కెఁ దగ్గమున్. ౧౪౦

గీ. కాలువ ల్దాఁటి దాఁటి, తెమనఁగు పుష్పాదితిట్టల నెక్కియెక్కి
కోరిదవ్వుల పువ్వులు గోసికోసి, యలసియును మానకు ౮౫

ఉ. కమలాకరుఁ డావనకేళి మాని యు
ప్పొంగెడు వేడ్కతోడఁ బువుఁబోఁడులుఁ దానును గూడి భృంగచ
క్రాంగర కాంగముఖ్యవిహగావృతముం
... ... ... ... ౮౬

ఉ. చేరఁగఁబోయి సొమ్ములును జీరలుఁ దీరమునందుఁ బెట్టి చా
క్షారపు వల్వపావడలు గట్టి తనుద్యుతు లుల్లసిల్ల న
వ్వారివిహారలీల లనివారితసంభ్రమ మొప్ప
... ... ... ... ౮౭

చ. ... ... ద్భుతనిత్యపరిపూర్ణమనోరథుఁడౌచు వైభవ
స్ఫురణ దలిర్పఁగా నెలమిఁ బుత్రులుఁ బౌత్రులుఁ జాలఁగల్గ సు
స్థిరరమణీయభోగము
... ... ... ... నివ్వటిల్లఁగన్. ౮౮

క. ఈకథలు వ్రాయఁ జదివిన, నాకర్ణన మొనరఁజేయ నాయువు శ్రీయుం
జేకుఱఁగ సుఖంతురు తు, శ్లోకులన ౮౯

ఉ. ప్రతిమానదానవి
ద్యామహనీయవైభవకృతార్థితసుస్థలిరాజమత్సరో
ద్దామవిరోధిమంత్రిజనతాదృఢమంత్రరహస్య
... ... ... ... ... ౯౦

క. , నాటకముఖకోహళాదినాట్యరహస్యో
ద్ఘాటన నిపుణప్రజ్ఞ, పాటవచాతుర్య నూత్నభరతాచార్యా. ౯౧
... ... కౌశల్యవాదా,
ప్రాసక్తార్థిప్రకర ర్థనాతీతదానా
హాసాంకూరస్ఫుటజయా— ౯౨

గద్యము—ఇది శ్రీమద్వెన్నెలకంటిసూరనామాత్యపుత్త్రహరితసగోత్త్రపవి
త్త్ర సుకవిజనమైత్త్రీవిధేయ యన్నయనామధేయ ప్రణీతంబైన షోడశకు
మారచరిత్త్రంబునందు సర్వంబు నష్టమాశ్వాసము.

---

శ్రీరస్తు.

# షోడశకుమారచరిత్రము.

## — ప్రథమాశ్వాసము —

---

వ. అభ్యుదయపరంపరాభివృద్ధిగా నాయొనర్పఁ బూనిన కథాకల్పవల్లికామతల్లి
కకు నాలవాలంబగు హస్తినాపురం బెట్టి దనిన. ౧

గీ. ఆది ప్పురమునఁ, గోపురంబుఁడెగాఁ జూడఁ గడలి వచ్చి
కోటపారరాకకూఁతుపైఁగూర్కిఁజుట్టు, వారియున్నట్టులొప్పారుపరిఖ మెఱయు.

గీ. అక్షయఖ్యాతి నెంతయునంద మొంది, యమలకమలోదయస్థానమనఁగ వెలసి
కువలయప్రియహేతువై కొమరుమీఱి, యలరు నప్పురిపరిఖ దుగ్ధాబ్ధిభంగి.

గీ. మహితసన్మార్గవర్తనమాన్యులనఁగఁ, బొలుచునినరాజకవిగురుబుధులనైనఁ
దగులువడఁ జేయు పెంపునఁ దనరుమీటి, కోటకొమ్మలు తారకాస్ఫోటనములు.

సీ. ధామాద్యుతోద్దామహేమకుంభంబులు తరణిమండలముతోఁ దడఁబడంగ
నుపరిభాగస్థాపితోజ్జ్వలరత్నంబు లలతితారకములఁ గలసి మెఱయఁ
బ్రమదకేళీలోలబాలముఖేందులు చంద్రబింబంబుతో సరసమాడఁ
గనకరత్నవిభాసితునచంద్రశాలలు ఖచరవిమానసంఘములఁ గలయఁ
జారుమౌక్తికమణిమయతోరణముల, బహుమనోహరచిత్రసంపదలమహిత
విభవములతోడ నెంతయు విస్తరిల్లు, సురపురంబన హస్తినాపురవరంబు.

చ. అమరులకంటెఁ దత్పురి ధరామరవల్లభు లెక్కుడంట త
థ్యము తలపోయ నాగమవిధానములై తనరారు వారు ని
త్యము నొనరించు దానముల యజ్ఞములం బరితృప్తిఁ బొంది సం
భ్రమమునఁ దేలి వారు వడిఁ బ్రస్తుతిసేయఁగఁ గెంపుఁ జెంపుటల్. ౨

క. రాలెల్లను రత్నంబులు, చేలెల్లను రాజనంబుఁ జెఱకును బౌర
స్త్రీలెల్లఁ బద్మినులు పురి, శ్రీలనునుతియింప వశమె శేషున కైనన్. ౩

సీ. గిరులఱెక్కలుద్రుంచి గిరిభేది భూమిపైఁ ద్రొబ్బఁగఁ దనిన మేల్కొండలనఁగ
హరుఁ డాకగజమూర్తి నణఁచుట నీసుచే బహుగజాకృతులనైఁ బరఁగెననఁగ
వెలువెల్లఁ బాటించి విడిచెను గజములు హరినీలమూర్తుల నమరె ననఁగ
జడధికి గిరులను నడయాడనొల్లక మేఘబృందము లుర్వి మెలఁగెననఁగ

నున్నతాకృతి నెంతయుఁ జెన్నుమిగిలి, వందనీయభద్రస్ఫూర్తి నందమొంది
వినుతసత్వంబులను దానవృష్టి మెఱసి, తనరునప్పురి భద్రదంతావళములు. ౯

గీ. సిరులు మెఱసిన వారణపురములోన
మెలసితిరిగెడు హయముల మిసిమిచూచి
యమునితురగంబు లిలఁ గాలుకొనఁగ వెఱచు
చెల్లనై యుండు వేలుపురీటిహయము.

చ. అరదము పూన్పనొక్కమొన నవ్వును నక్కును... హయంబులో
ఖరకరునశ్వముల్ .. ... ...
... ... నూడఁడు నెన్నఁడు సోదరయ్య య
ప్పురిఁగల యుత్తమాశ్వములఁ బోఁడిగ నెక్కడు వాహకోత్తముల్. ౧౦

క. నవముక్తాతోరణములఁ, బ్రవిమలవజ్రాభిరామ భవనముల సుధా
ధవళప్రాసాదంబు ... ... గనిందుప్రభ నవ్వీటన్. ౧౧

గీ. నెఱయు నప్పురి వప్రాగ్రనీలమణుల, కాంతిసంగతి నాకాశగంగ యొప్పుఁ
జాదమున మింటిమీఁదఁ గాళిందితో ... ... ౧౨

సీ. ... ... తేనియల్ నిండారఁ దొరగినన
సౌగంధికముల వాసనగల విరిసిలఁ బ్రబలికై స్రాలిన రాజనములు
నిరుదెసం జెలువొందు త ... ... ...
... ... చిలుకలు దిండిన ఫలరసంబు
కలును, గలిగి బహిరంగణంబులు పొలుపుమిగులు
జనుల కెల్లకాలంబు నామని మెఱఁగ, సాధ్వ... ...సేయుసలవియుగని.

సీ. వా ... ... ంబు లెనక మెసఁగ
మెఱుఁగారు తేకులు నెఱిదప్పి యొండొంటిఁ గడవ నందడిపడి
... ... ... కుత్తుకకోలఁదులు గ్రోలిక్రోలి
అన్నా ... ంగన్మపుప్పొడి తిప్పలఁ బొరలిపొరలి
చెలువుమిగిలిన యుగ్విటికోలఁకులందు, డాఁటులెకూ
... ... మన్నవంగని వెగడువానిఁ గ్రెళ్ళునా ౧౪

సీ. రాజిలపుష్పపరాగంబుఁ బరఁగించు మదభృంగమోహనాస్పదలగాంచి
రమణీయ ... ... ... కలన మెఱయు
కర్పూరచందన ... ... ణంబుల నాకర్షణంబుసేయ
వివిధకేళీలోల విటవిటీసురతశ్రమంబుల నుచ్చాటనం బొనర్చు

గర ... ... ... నెంతయుఁ గరముతోడ
మంద ... ... ౧౭
వ. అప్పురంబున కధీశ్వరుండు. ౧౮
సీ. లీల వేల్పులనెల్ల పసినవాజిలో ముక్కంటిగెల్చి విఖ్యాతి
... ... ... గానేరాజతాతతండ్రి
దర ... ... గలంచె రారాజులబలమునే రాజతాత
కాలికాలములయందున ... ... ట్టి రాజాన్వయఖ్యాతుఁ డహిత
రాజరాజకిరీట విభ్రాజరత్న
కిరణనీరాజనారమ్య చరణుఁడాడి,రాజగుణరాజితుఁడు జనమేజయుండు.
చ. ... ... కుండాలకే
సరిదైతేయభయార్త దేవగణరక్షాదక్షుఁ డుగ్రారిభీ
కర తేజోనిధి సర్వసన్నుత కృపాగారంబు ధర్మక్రియా
నిరతుం డాజనమేజయుండు వె ౧౯
వ. ప్రభావతియుం గమలయు నగ్రమహిషులుగా మహనీయరాజ్యభోగంబు
లనుభవించుచుండఁ బ్రభావతికి శతానీకుం డనుకుమారుండు దయిం(చె).
క. వరపుత్రుఁగోరి కమలా, తరుణీమణి చాలనియతిఁ దరుణేందుకళా
ధరునారాధింపంగం, బరమేశ్వరుఁ డొక్క నాఁ డపారకరుణతోఁ. ౨౦
సీ. చన్నోం ... ... ... గుత్తి
జిగిమీఱు వెలిపట్టుచేలసంగడమున నెరుసారమూఁడువన్నియలచీర
బాగొందెడి పసిండిపచ్చలపదకంబు దాపునతొప్పారు పాఁపకంబె
తావులు సంగడిఁ బాలుపారు తెల్లని భూతిపూఁత
యమరనతివయుముగ వాఁడునైన వేల్పు,దనపాదవుఁగలలోనవందముగఁజూపి
రమణ మీఱంగ నొక్కయరంటిపండు, నేలజేవితెలిన కిచ్చె నెమ్మితోడ.
వ. అట్టి మేలికలఁ గని యాత్మగుణంబునసు మేలుకని యయ్యతివ తనప్రాణవల్ల
భునకుం జెప్పుటయు నతం డుల్లంబున నుల్లసిల్లి నీకొక్క పుత్రరత్నం బుద
యించు నని చెప్పి యానందకందళితమానసుం డగుచున్నంతఁ గొన్నిదివ
సంబులకు నెలమసలిన. ౨౧
సీ. మానినీరత్నంబు మధ్యంబుతోడన వలుదలై యూరులు చెలువు మిగిలె
సుదతీలలామంబు చూచుకంబులతోన యామ గప్పారి యొప్పారఁ దొడఁగె

నలినీలకుంతల యంగవల్లికతోడఁ బయిచగాఁ జెక్కులు బలుకఁబాఱె
శీతాంశుబింబాస్యచెయ్వుల తోడన నలసంబు లయ్యె నేత్రాంచలములు
జలజలోచనవడపుల జనను దోఁచెఁ, జాను నిక్కఁగఁ గోర్కులు నందడించెఁ
దరుణివాలుకదపులకు నెరవుపడియెఁ, జెన్నుదఱుఁగుచుగర్భదశ్రీకతమున.

చ. అలసములయ్యెఁ జెయ్వు లవయంబుఁ బ్రియం బొనరించెఁ జాగ్రిక
న్నలుపును జెంది యుండియు మనః ప్రమదావహమయ్యెఁ జన్నుదో
యొయ్యల నెలఁ బాఱియుండియు నవీనవిలాసము జెక్కులందులం
బొలుపసలారె గర్భమునఁ బోఁడిమి నయ్యెగు రాకుఁబోఁడికిన్. ౨౬

తే. వడఁతిచనుదోయి హేమకుంభములకంటె
నొక్క గజకుంభములకంటె నొప్పు నసఁగ
జనులకనుఁబాటుదాఁకి కంటెనో యనంగ
గర్భసంపదఁ జనుమొన గ్రువ్వదాల్చె. ౨౭

గీ. విధుల నన్నింటి నింటింట నెలవుకొలిపి, ధరణిఁ బేదలు లేకుండ నరయఁగోరు
నేమదీప్తుల నేలంగ విచ్చఁగోరు, గురుబుధానంద మొనరింపఁగోరు పతివ.

వ. ఇవ్విధంబున గర్భసంపదఁ జెనువుపఱిందినవమాసంబులుం బరిపూర్ణం
బు లగుడు నంత నొక్క శుభసమయంబున. ౨౮

క. మారుని గు, మారునిఁ బోల్పంగఁదగిన మహనీయశుభా
కారు మనోహరతేజః,స్ఫారువరకుమారుఁ గనియెఁ బ్రమదం బెసఁగన్.

క. నింగాంచిన, యావత్త మహీశు మనమునం దలరంగాఁ
దావెలయఁజేసి బంధుజ, నావలి కత్యంతశుభము నాపాదించెన్. ౨౯

సీ. మంగళతూర్యసమాజంబునకు మున్న న(భమునసొర)మందుభులు మ్రోసె
నర్తకీమోహన నాట్యంబునకుమున్న విగ్రశీనృత్యంబు నెగఁజెలఁగె
నతివలు శోభనాక్షతలు చల్లకమున్న సురపుష్పవర్షము గురియఁదొడఁగె
బ్రాహ్మణాశీర్వాదరావంబునకు మున్న యనిమిషకోటి దీవనలు దోఁచెఁ
బొలసిదక్షిణపవనుండు వెలసెదిశల, హవ్యవాహనుఁ డుప్రదక్షిణార్చియయ్యె
జనవమఁడు వేడ్కఁ బ్రియముందెసకలలోక
మోదకరమైనయక్కుమారోదయమున. ౩౦

వ. అట్టి మహోత్సవమున జనమేజయమహీనాథుండు నానావిధదానంబులుఁ
గామితవస్తుత్యాగంబులు బంధమోక్షణంబులు జపహోమంబులు నొనరిం

చి సముచితపరివారుండై కుమారునకుం గమలాకరుం డనునామం బిడిన
మొదలివత్సరంబున విదియచందురుంబోలె ననుదిన ప్రవర్ధమానుం డగుచు
ముద్దుఁబలుకులు పచరించుచుండ. ౩౧

చ. హృదయము లుబ్బ నొండొరుల కిట్టివిధం బని చెప్పఁబోపుచున్
మృదుమధురంపు టాటలను మేనలరంగను గౌఁగిలించుచు
న్ముదితయు నాథుఁడుం గొడుకుముద్దులఁ దేలనకాని యెన్నఁడు
న్మదిని దలంపరంచితరమావిభవోజ్జ్వలరాజ్యభోగముల్. ౩౨

క. ఇట్లతిగౌరవంబునం బెనుపం బెరిఁగి సముచితసమయసమాచరిత చౌలోప
నయనుం డై. ౩౩

సీ. వేదవేదాంగము ల్వివిధపురాణేతిహాసము ల్ధర్మార్థశాస్త్ర
ములును నాయుర్వేదమును ధనుర్వేదంబు భరతశాస్త్రంబును బంచబాణ
శాస్త్రంబు కామందచాణక్యభార్గవ్యకౌణపదంతముఖ్యప్రదీప
భూపాలనయశాస్త్రములు శిల్పశాస్త్రంబుఁ గావ్యము ల్లక్షణగ్రంథములును
నాటకంబులు సర్వనానాకళాప్రపంచమును నలవడంగ శీలించి దుష్ట
కుంజరరథాధిరోహణకుశలుఁడై ని,రూఢిఁ జెన్నొందె మిగులంగఁ బ్రౌఢిమెఱసి

వ. నవయౌవనంబు నొందుసమయంబున జనమేజయజననాథుండు రాజకుమా
రానీకశేఖరుం డగు శతానీకుని నిజరాజ్యంబునకు నభిషిక్తునిం జేసి యక్క
మలాకరకుమారునకు యౌవరాజ్యపట్టంబు గట్టి సమస్తంబు నప్పగించి
తానును దేవీద్వయంబును దపోవనంబున కరిగిన. ౩౪

క. లోకోన్నతగరిమ శతా,నీకుఁడు రాజ్యంబు నొనర్ప నెమ్మిని యువరా
జైకమలాకరుఁ డురువిభ,వాకరుఁడై యనుదినంబు నన్నుంగొలుచున్. ౩౫

సీ. అంగహీనతయును హరవిరోధము మాని కనుపట్టు మకరకేతనుఁ డనంగ
వనవాసమును గృష్ణవర్ణత్వమును మాని పిలసిల్లు నిందిరావిభుఁ డనంగ
బదుగుఁజందంబును నొదలికందును మానిసంపూర్ణరుచినొప్పుచంద్రుఁ డనఁగ
ఘనపిధానంబును ఖరకరత్వము మాని తనువుసైఁ బెనుపొందుతపనుఁ డనఁగ
రూపలెను కాంతిలక్ష్మీ ప్రతాపమహిమ,లఖిలవర్ణనీయంబులై యతిశయిల్ల
యౌవనోజ్జ్వలతరమూర్తి నందమొందు,నఖలకమలాకరుఁడు కమలాకరుండు

మ. జగదానందవిహార హారమకుటచ్ఛత్రాదిసంపన్న వ
స్నగభూషార్పితభావ భావజకళానైపుణ్య పుణ్యక్రియా

సుగమాచారగభీర ధీరహిత తేజోదీవ్యమానక్షమా
గగనాభోగదిశాంత శాంతమదరాగద్వేషగర్వోదయా. ౩౮

క. ఆఖ్యానకల్పితకథో,పాఖ్యానాఖ్యాయికా ప్రపంచ రహస్య
వ్యాఖ్యానవ్యవహరణ, ప్రఖ్యాతచరిత్ర వికచపంకజనేత్రా. ౩౯

మాలిని. శమదమగుణమోదీ శైవసిద్ధాంతవేదీ
సముచితనయబుద్ధీ సంచితైశ్వర్యసిద్ధీ
యమనియమధురీణా యజ్ఞకర్మప్రవీణా
శమితదురితవేగా సాధితాష్టాంగయోగా. ౪౦

గద్యము. ఇది శ్రీమద్వెన్నలకంటి సూరనామాత్యపుత్ర హారీతసగోత్రపవిత్ర సుకవిజనమైత్రీవిధేయ అన్నయనామధేయప్రణీతంబైన షోడశకుమారచరిత్రంబునందుఁ బ్రథమాశ్వాసము.

---

యనుపమానవగ్రహప్రభాధరణమాభరణమాలాగణం బరసి తోడిప
లీలఁ గస్తూరిచే ఫాలభాగములందు గములందుకొనుచుఁ జక్కలఘటించి
పూతిమానసలై గౌరిపూజ గూర్చి,కూర్చి నిన్ను వరింపరే గోపసతులు,చా.
మేఘవర్ణుని జూడవే ఘనసారమా సారమా యావరిచ్ఛన్నుఁ డతఁడు
గోపరూపకుని గన్గొనవె హింతాళమా తాళ మాతరమె దయాళుఁడతఁడు
కాంచనాంశుకధారిఁ గాంచవే తిలకమా తిలక మానసమునఁ గలుగునతఁడు
ఘనవేణునాదుని గానవే కుందమా కుందమా కపకున్నఁ గుటిలుఁ డతఁడు
మానధనహారియై యెట్లు మన్మువనుచు, గనుచు గోపికలరయుచెనినుభ్రమించి
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౮
కోరిచేపట్టినా గోపకుమారుండు మారుం డనంగుని మాన్తిఁ జనఁడె
పాలించెనా శౌరి ప్రచలితోపవనుండు పవనుండు పలుగడఁ బరువు లిడఁడె
నందనందనుఁ జేలెనా కలకంఠకంబు కంఠకంబు రాచి గద్గదతఁ బడదె
రక్షించెనా హరి రాకానిశాపతి శాపతిరోహితచ్ఛవిని గనఁడె
యంచుఁదమలోన నెన్నుచు నధిగమించి,మించి వ్రేతలు నిన్ను మోహించి కౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౫౯
వెలఁదులు నీకు వ్రేతలకు నీ విరుగడ విరుగడగాని బంధురత నిలువ
బాలికాకరతాళఫణితిఁ ద్రికాలము ల్గాలముల్గాఁడిటిఁ గనుట దెలుప
భవదభంగభ్రూవిభంగవితానంబు తానంబుఁ బలుకు గాత్రంబు నొలయ
నన్యోన్యకంఠవిన్యస్తహస్తమ్ములు తమ్ములు గల మృణాళమ్ము లనఁగ
రాసమండలగతి వేఁబరావ మలర, మలరహితవృత్తి మధ్యమండలరితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౦

(7) గోపాలనదశకము.

దధిభాండమథననాదమున దిగ్గన మేలుగన మేలుకని వత్సగణము విడిచి
ప్రబలుఁడై యులరారు బలరాముతోడనే తోడనే నెనరునఁ గూడి చెలఁగి
జనని గూర్చినపక్వమున కాత్మసలరుచు నలరుచు లెన్నుచుఁ జలిది మెసవి
భువనమోహనరావమునఁ గరంబఱచుచుఁ బఱచుచుఁ గ్రేపులఁ బాయఁద్రోలి
బాలకులు తోడరా నీవు పసులఁగాయఁ,గాయమాత్రమయులరితిగా దెమందఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౧
అపరంజిబంధసూత్రాగ్రంబులాగుచు లాగుచు మట్టిచల్లడము దొడిగి
ధవళప్రభంబైన యువసరానన్నంపు నన్నంపుజమిలికూసంబుఁ బూని

తలచుట్టురా నీలగళశిఖిపింఛ మతిపూత మతిపూతశాలు రుమాలుచుట్టి
చులుకనిరత్నకంబళమ్ముతో వెలయింపు వెలయింపు కందువా మొల బిగించి
చలిది పిడచేతఁ గుడిచేతఁ జటుకుఁ జెలఁగఁ
జెలఁగునీగోపరూపంబుఁ దలఁచువాఁడఁ
జారుతరమందహాస పోలూరివాస
వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౨
పోదునఁ జెఱఁగి మేచీదరమిత్తని మెత్తనిపచ్చిక మేపికొనుచు
నీల నాకర్ణించి లీల నేతేరఁగాఁ దేరగా వనములఁ ద్రిప్పికొనుచు
రిక్క వేయుచు నెచ్చరించి కావించఁగా మించఁగా నీరు ద్రావించుకొనుచుఁ
దరులనీడలనుండఁ దరలించి మరలఁగాఁ మరలఁగాయుచుఁ బులినరసికొనుచుఁ
జెలఁగిగోవత్సములమందఁ జేర్చిమీఱు, మీఱువాణంబుగలమూర్తి సోరు నెంతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౩
అరసిగోవత్సబృందాహ్వయోత్తర మెత్తి కర మెత్తి చీరి మాఁపురము లంటి
యుత్తాత్తి నిలిచిన హస్తనీరజమున రజము నఖశ్రేణి రాచి త్రోచి
యాఁబోతుగిబ్బల నావుల యెదనెన్ని యెదనెన్నిపనులున్న వదలి విడిచి
బెదరఁగాఁ గని పులి భీతినివృత్తికి వృత్తికిఁ దగు పొగ వేటు వేసి
కడచి యారీతిఁ గోవత్సగణము నేల, నేలవే యేటికేటికి నినుమడింపఁ, జా.
వానలఁ బెంపొంది వాడక కలుకునఁ గలుకునఁ దనరారుఘాసచయము
మృదులతరంగకంపితతామరసములై రసములై తగునదీహ్రదగణంబు
వెలితిగన్పడని నీడల వెదచల్లఁగాఁ జల్లఁగాఁ దనరు వృక్షవ్రజంబు
పడుకవాసిని గనంబడు మొలుంగుల మొల్లఁ గులమొల్ల నానను గోష్ఠవితతి
దనర నేవేళ నాశ్రితవనవసంత, సంతరింపవె గోవత్ససమితి సహహా, చారు.
ఆవులు సురధేనులట్లు పెంపెక్కఁగాఁ జెక్కఁగా ముప్పొద్దుఁ బిదుకువలన
నలరఁగా శైలంబు లట్లు మూఁపురములఁ బురముల వృషభము ల్పొబ్బవలన
వెలయఁగాఁ గోడెలు పులుల కైవడి నొప్పి వడినొప్పినిడు అంక కైచువలనఁ
దనరారఁగా నెలతఱుపులు కరుల వైఖరుల యొయ్యారంబు గతులవలన
గౌరభవదీయపాలనోదారమహిమ, మహిమదోద్ధతిఁ బ్రబలించెమందవసులఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౬౪
అఖిలచరాచరప్రాణి జీవనముల వనములఁ దటభూమి ననుసరించి
ముత్తరోలంబడింభకకదంబాలక పాలకగణముతో బంతిసాగి

వామహస్తములఁ గేవలత మానవరుచి నవరుచి పెరుఁగువంటకముఁ బూని
ముస్తునోరులు ముద్దముద్దకు నూరఁగా నూరుఁగాయల వ్రేళ్ళ నొక్కఁబట్టి
యుప్పుతుత్తునఁ గాదినదప్పియార, నారగింపవె నరనఁ బులాముకొనుచుఁ, జా.
ఖగములు ధూమంబు గప్పినఁ గాకక గానఁ గలంగుచుఁ గలియఁ దిరుగ
మృగములు పైలైనసెగలవెంబడిఁ బడి బడి బడి మైఁగాల్ప పడవిదరుగ
నురగులు బలుమంట లోఁడియుఁగా నాకుల నాకులమున భీతి పెరిగి చొరఁగ
లలితవృక్షములు కీలాచయం బేర్చినఁ బేర్చినలతలతోఁ బృథివిఁ దొరఁగ
పడరువనవహ్నిఁ గ్రోలి నెయ్యమున గోవ, గోపరిత్రాణమొనరించు దేవ దేవ, చా.
ఆజ్ఞానుసరణగోపార్భకరాజితో రాజితోత్ఫుల్లపత్రంబుతోడ
గోధూళిధూసరాంకురకుంతలాళితో లాలితోజ్జ్వలనిటలంబుతోడఁ
గలితదండవదండకరతల పాళితోఁ బాలితోదారగోప్రతతితోడఁ
బరిపంథిభంజనప్రఖ్యాతికీర్తితోఁ గీర్తితోరుశరాంగమూర్తితోడ
సన్తమయు వేళఁ దర్శనాహ్వానశబ్ద, శబ్దముల మించ కేగు నీసొరు నెంతుఁ, జా.
అఖిలవృక్షములు ఝంఝూనిలవేగత వేగతశాఖలై విఱిగిపడఁగఁ
జేరిగర్జిల్లుటచే పీడి యాశల యాశలగని చేతనౌఘుమేగ
జంతుసంతతి నేత్రసంఘాత మెఱుపుల మెఱుపులచే మిఱుమిట్లుగొనఁగ
వివిధనివాసముల్ వృష్టిసంపాతత పాతతమోజలప్లవము గాఁగ
పడరుపర్జన్యుఁ గని కేల నద్రిఁ బూని, పూనికల గోపగోతతిఁ బ్రోచితౌర
చారుతరమందహాస శోభాళివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౦

(8) దుష్టనిగ్రహదశకము.

వచ్చి విషస్తన్య మిచ్చిన ధూతకి ధూతకిశోరక ప్రీతిఁ దునిమి
బండిరూపమునఁ గైఁబడిన నీచపలాడి చపలాడిగుణు లాక్త జడియఁ ద్రుంచి
నిను జుట్టిపట్టి యొత్తినపవనాకారి నాకారిఖలులు వణంక నడచి
యులయులూఖలహతి నర్జునాగములు గములు నెట్టి పెకల్చి కూల్చి
తౌర నీకిట్టు లపకారులైనవారి, వారిజోదర వధియించి మీఱితౌర
చారుతరమందహాస శోభాలివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౨౧
కపటప్రచారంబు గని నందవత్సక వత్సకళేబరశ్రీరిఁ దుంచి
ఘోరాటవీస్థలి గోపబాలకమూర్తి బకమూర్తి నిర్గతప్రాణుఁ జేసి
యొద వృషాసంచార మెఱిఁగి విధూతాఘు ధూతాఘుదనుజాని దునిమిత్రైవి
కేళిమై సర్వగోపాలశేఖరగతి ఖరగతి నెదిరినఖలు నడంచి

యుదరియాకీర్తిమాయాప్రలంబకలంక,లంపటలోనద్భుఖలులఁగూల్ప వెయదల్చి
దామతరసుందహాస సోలూరివాస, వారిజాయతనేత్ర మన్నారుకృష్ణ. ౭౩
నృత్యంబు ఫణముల నెఱపి పెక్కఁదలించి కదలించి కాళింగు గర్వమణఁచి
కను సన్న చేసి తార్క్ష్యారి మహాబలుని చే బలుని చేతఁ బలంబుఁ గలనఁ గూల్చి
కని సుదర్శననామఖచరగర్వాహిని వాహినీగటమున దేహముడివి
సఖుల మ్రుచ్చిలి మింటఁ జనుకంఠమాముని చూచుమీపాటని కూడి త్రుంచి
కెలయు వే దోర్బలత నెట్టిఖలుల నైన, నైనవారిని ద్రోచుటకై వధించి, చా.
జనకుని సీట వాఁచిన పాశకరుని కింకరు నకించను బదాక్రాంతుఁ జేసి
కొమ్ములఁ గ్రుమ్మఁ దార్క్ష్యాను వృషభాసుసు భాసురభుజశక్తి బడలువఱచి
కినిసి హయాకార కేశినామారాతి మారాతిసుందర నీరుచేసి
బాలురఁ గలసి మాయాలోలగతి నాకుగతి వాఁకు వ్యోమరాక్షసు వధించి
కలనకూపలలోఁ బరాక్రమనిరూఢి, నూఢిశక్తిని వసమానరుచిర తేజ, చా.
గరువంపురజకుని నరిభయంకరమునఁ గరమున నుత్తమాంగంబు చఱచి
యనిలోనఁ ద్రొక్కవచ్చిన మత్తకుంభిని గుంభిని యక్రువగాఁ గూల్చివైచి
మల్లయుద్ధమున మత్తిల్లుచాణూరుని నూరుని గ్రహములఁ బోరి చంపి
చేరి ముష్టాముష్టి సీరిచే ముష్టికు ముష్టి కులిశహతి నొక్క చెఱిచి
దృష్టిపథమునఁబడినమాదుష్టకతిని,దతినిబరిమార్చిదోశ్శక్తిఁదనరితౌర, చా.
ఆజన్మశత్రుఁడై యువని వ్యాసుల రక్షసులఁ రట్టడినేలు కంసుఁ జంపి
ముచికుందనేత్రాగ్ని మొనయుటపాయంబుపాయంబుగాఁ గాలయవను నోర్చి
కూష్ణ సత్రాజిత్తుఁ గూల్చి దుస్తరగతి దరకతిఁ జను శతధన్వుఁ ద్రుంచి
యాంతఃపురద్రోహు లగుమురనరకుల నరకుల ముఖ్యాంగ వరుసఁ గూల్చి
ఖలుల నిట్లువధింపఁగాఁ గ్రమము మెసంగ, సంగరముచేసివట్టిదోస్సారధీర, చా.
అనిరుద్ధుఁ జెఱవెట్టి యాజి శంకరశక్తి శరశక్తి గలబాణు గర్వ మడఁచి
తనచిహ్నములు దాల్చు నని నహంకని కానిపని కానిఁ బౌండ్రకుఁ దునిమి వైచి
యాలని కనికిఁ దోడగు కాశికావరు కావరుఁ డని వాని గళము ద్రుంచి
కృత్తినఁ బీన మదోన్నత్తు సుదక్షిణు దక్షిణాకర హేతి దాడి నోర్చి
యాకరణిదుష్టజనముల నేర్చిపిదప,పిదపకృత్యము వెడలించిహాదలితౌర, చా.
హరిణయం బొది దర్పము జనింపఁగ వట్టి పగవట్టికొనుశిశుపాలుఁ దునిమి
శంకరవరలబ్ధసౌంభక సహితుఁడై నహితుఁడై యుదరిన సాల్వుఁ ద్రుంచి

దంతవక్త్రుని మహోద్దామకామోదకీ మోదకీలితమనోమూర్తి నడంచి
కలన నమోఘచక్రముచే విదూరుని దూఱు నీఁక నని త్రుళ్ళడంచి
యుట్టిదుర్మార్గవర్తులనరసి యోర్చి, యోర్చిధాత్రీకిఁ గడుమేలుగూర్చితౌర, చా.

సారె జూదంబాడి సభ నుల్లసము లాత్మసము లాత్మ నలరఁగాఁ జలుపుదుష్ట
బాణుని సేనాధిపతుల మమ్మనిమాను మని చూఁడు కుంభాండకాదిరిపులఁ
బురములఁ దరుల విస్ఫురితేచ్ఛ విహరించు విహరించు దుర్మదద్వివిదకపిని
సతతతపస్సమాశ్రితమహావనులఁ బావనుల బాధించు పల్వలసురారి
బలుని చేనిట్లు శౌర్యసంపన్నకాయ, కాయములవీడఁ జేసినకర్మసాక్షి, చారు.

కుడిచేత ములుకోలఁ గొని వామకరమునఁ గరము నశ్వములపగ్గములఁ బూని
శిరమున ముకుటంబు చెలఁగ రంజన ఘనాంజనఘనాంగముల దుశ్శాలువైచి
రథికుని నదలించి రణమున దరము సుందరము చూపెను చిఱునవ్వు గలిగి
సన్నద్ధచతురంగసైన్యవికల్పన కల్పసంగతి యుపాంగముల నిలిపి
పార్థసారథివై చలపట్టి యాఁచి, యాఁచి కురుసేన నశియింపఁ జూచితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౮౦

## (౯) శిష్టప్రతిపాలకదశకము.

మును నవమాసము ల్మోచిన దేవకి దేవకీర్ణపద ప్రభావ మొంద
నిను దివ్యమూర్తిఁ గాంచిన వసుదేవుని దేవుని నినుఁ జేరు త్రోవ దెలియఁ
జేర్చి పాలిచ్చి పెంచిన యశోదాసతి దాసతీవ్రావాప్తి వాన నొలయ
భవదమర్త్యక్రియాప్రాపితానందుని నందుని ముక్తితానకము నెఱుఁగఁ
బూర్వభవపుణ్యపరిపాకభూతిచేతఁ, జేతనప్రాయసుతుఁడవై చేసితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ ౮౧

జనకులు వలదన్న వినక సంపదశక్తిఁ బదశక్తిఁ గొందఱు పరువు లిడుచుఁ
దోఁబుట్టు లాఁగినఁ దొలఁగి యాత్రావనగతి వనగతిఁ గొందఱు పాడుకొనుచు
విభులు పోకుఁడటన్న విడిచి రాజితమూర్తి జితమూర్తిఁ గొందఱు జతలుగొనుచు
మించి మామల నేమటించి యాశాంతత శాంతతఁ గొందఱు జాలిగొనుచు
విప్రసతులిట్లు తెచ్చినవిందు మెచ్చి, మెచ్చుచు భుజించి వాంఛితమిచ్చితౌర, చా.

దూరీకృతానిశాతురదుర్జనక్రూరు నక్రూరు బహువిర్తలాత్మఁ దనుచు
మన్నించి చేరిన మాలికాకారుని గారునీకొన మెట్టి ధీమ లనుచు
వరుగువీథిని నెదురైన వామనగాత్రి మనఁగాఁద్రివక్రత మలయు నసుచు

మానవస్థితి నుగ్రసేనమహీను నహీనుని గతి నిర్వహింపఁ దనుచుఁ
బాడమునిశ్లాఘకకటాక్షమునఁ గేవ, కేవజనులుత్సహింపరక్షించితౌర, చా.

నరకవానరఁ గ్రాలు గురుతరూథపులఁ బ్రాథపుల ప్రారబ్ధానుభవము మాన్పి
మాగధపీడిత మధురాజనావలి నావలిద్వారక కిరఁ జేర్చి
చెడుకాలయవనుని చే ముచికుందుని కుందునిద్దుర మేలుకొలుపఁ జేసి
యూపరవల్లిమే నూని కూపమునఁ దాపమునందు నృగుని శాపంబు దీర్చి
ప్రోచితివి గాదె నీవంటి పురుషమౌళి, మౌళిగతపింఛ కల్గునే లీలలందుఁ, జా.

మోహాతిరేకమనోహరాభావత భావతాపాగ్నులపాలు గాక
హితజనాదృతనిత్యకృత్యవిహీనత హీనతమోగుణాపేక్ష లేదన
శుద్ధరాజసగతబుద్ధి వియోగత యోగతాపసవృత్తి యుక్తి లోలయు
మృష్టాన్నమృదుపటాభీష్టవిదూరత దూరతరైశ్వర్యధుని మునుంగ
నరకమాగధులలయించు నిరుపమాన, మానవతులనృపులనుమనిచితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౮౫

కృపణత దత్తదారిద్ర్యదైశ్వర్యుఁ డై వర్యుఁ డై తగు విప్రవరులలోన
వేదశాస్త్రపురాణ విద్యాప్రసంగుఁ డై సంగుఁ డై తగుసభాసదులలోన
సప్రార్థితార్థపర్యవసానకాలుఁ డై కాలుఁ డై తగు సూక్తిమతులలోన
ధర సహింసాకర్మ ధర్మప్రసిద్ధుఁ డై సిద్ధుఁ డై తగు బుధశ్రేణిలోన
ననుచు సహపాఠకుఁ గుచేలు నరసి మున్న
మున్నికల మించు సిరు లిచ్చి యేలితౌర
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ.

తుల మాయాద్యూతగతులనోడించిన డించినమతిఁ బ్రల్లదించు శకుని
చేరి ధమ్మిల్లంబు జిరకు కేశయమున శయమున నోడియు దుశ్శాసనుండు
మగ లోడి రిఁక నిష్ఠురుగుబహోన్నతివాని వలివా నిరీక్షింపు మనినకర్ణు
సంబరంబు వదల్చు మని పాపయుక్తుల యుక్తులఁ గనరు దుర్యోధనుండు
వట్లుదుష్టచతుష్టయం బవరఁ గృష్ణ, కృష్ణయనసక్కయుకటంబులిచ్చితౌర, చా.

రుణ ధర్మజా నిజావరజనాథుఁ గా నాథుగా నీవసుంధరకుఁ జేసి
దుర్యోధనాది శత్రులకెల్ల భీతుని భీముని గా నాజిభూమిఁ జేసి
భీష్మాదియోధుల భేదింప విజయుని విజయుని గాఁ బోరుకేళిఁ జేసి
మాద్రి భంజింప మాద్రికుమారుల మారులఁ గాఁ గసి మనఁగఁ జేసి
రేయుఁబవలిట్లుకంటికిరెప్పగతివి, గతినిజవఁ బాండవేయులఁ గాచితౌర, చా.

దాసీసుతుం డని తలఁచితివే దాంతు వేదాంతు విదురుని విందు గొనఁగ
వరివస్యుఁ డంటివే యసువుల నాఁపఁగా నాపగాసుతుని గుయ్యాలకింపఁ
గుప్తదుర్గతుఁ డనుకొంటివే చేతనాచేతనాగత పరీక్షిత్తుఁ బ్రోవఁ
గాలంబు నెంచితివే లోకధర్మతాధర్మతాత్పర్య ముద్ధవుని దెలుప
నిట్టి భక్తపరాధీనవృత్తిచర్య, చర్యమాణసురల్లాల్పశక్తు లటర, చా.
తుదముట్టఁడే మహాద్యుతుఁడు లీలాశుకు లాశుకసూక్తుల ననుసరించి
దరిఁజేరఁడే పురందరనామః క్షురు క్షుర క్షవు నిన్ను వినుతిచేసి
ప్రకృతి వీక్షించఁడె నారాయణతీర్థులు తీర్థపాదుని నిన్నుఁ దెలియఁ బలికి
వ్యాజసంస్మృతి వీడఁడే జయదేవుండు దేవుండ నగునీదు సేవఁ జేసి
భక్తివారధి యున్నదుపాస్తిపరులు, పరులు జనులకు వారలఁ బ్రణుతిచేతుఁ
జారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౦

(10) అవతారదశకము.

అజుఁడు చిన్మద్గ్రాసమాధినిశిష్టుఁడై శిష్టుఁడై ధ్యానంబు సేయువేళ
సోమకుం డనురాక్షసుండు వేదమ్ములఁ దమ్ములఁ దెగడుసూ తమ్ము లనుచు
మ్రుచ్చిలి ఘోరవార్ధులఁ దిరోహితుఁడైనహితుఁడైనధాతసృష్టిచ్ఛకొఱకుఁ
బ్రబలమీనావతారము నెత్తి లోలకల్లోలకర్దమయుతావాల మరసి
చోరదనుజుని బరిమార్చి శ్రుతిగణంబు, నంబుజభవుండున కొసంగి నట్టిదేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౧
చెలిమిదేవబలాళనులు మందరాగంబు రాగంబు మించు ధీరతఁ బెకల్చి
కలశవారాశిలో నిలిపి పన్నగపతి నగపతిఁ జుట్టిరా బిగియఁ జుట్టి
విసువక మథియింప ససమాపఘనమైన ఘనమైనకచ్ఛపతనువు నెత్తి
క్రుంగుతద్గిరిమోచి యంగనామూర్తిచే మూర్తిచేతోసుర ల్మను భ్రమింపఁ
జేసియమృతంబుగోనిసుఖస్థితులనమరు,నమరులకుఁ బ్రీతినర్పించినట్టిదేవ,చా.
అవని మ్రుచ్చిలి హిరణ్యాక్షుండు దర్పితాశ్చర్యతారుణ్యదోస్సారుఁ డగుచు
నుదధిలోనఁ జరించుచున్నఁ దత్క్రౌర్యం బశ్రుత్యం బటంచు నాదైత్యవిభుని
లోకభయంకరాలోకనోదారభూదారభూభుజుఁడవై తాఁకి నిలిచి
పోరు పెల్లొనరించి ఘోరసుదర్శన దర్శనప్రహారణోద్ధతులఁ గూల్చి
పుడమి దక్షిణశృంగాగ్రమునను బెట్టి, బెట్టిదపుసంకటముబాపినట్టిదేవ, చా.
భవదీయచింతనాపరుఁ డంచు నందనునం దనురాగమోహములు వదలి
సర్వగతుం డని చక్రవర్తించెదు నించెదు సభ నవిసీతు లెల్ల

దరిఁ జూపు మని సభా స్తంభంబు నడిచిన నడిచి నభఃస్థమాంతస్థవిభుత
నరసింహమూర్తివై యరుదెంచి క్రమపరాక్రమపరాయణుల హిరణ్యకశిపు
నదరి పరిమార్చి కరుణ నయ్యదితిపట్టిఁ, బట్టి ప్రహ్లాదు రక్షించినట్టిదేవ, చా.
అఖిలార్థిజనసంచయాదితేయాగంబు యాగంబు కావ్యసమక్షమునను
గావించుబలినామదేవారినాథుని నాథుసీజన్మబీజాంఘ్రి కైన
నీవు వటుండవై నిలిచి సదస్యులు దస్యులు వినఁ బదత్రయముకొలఁదిఁ
బుడమిని యాచించి భూవిష్ణుపదములఁ బదముల రెండిటిఁ బాదమొకటి
శిరమునం దుంచి యతలంబుఁ జేరనడిమి, యదితిని వజ్రికిసిరులిచ్చినట్టిదేవ, చా.
జగతి సుదర్శనాంశమున జన్మించిన మించినభుజశక్తి మేటిదైన
కార్తవీర్యుం డాదిగా మహాభుజుల భూభుజుల భూతవ్రాతములు గలంగఁ
బరశురామాకృతిఁ బరఁగి నగరములఁ గరముల శిరములఁ జరణనమితి
నిరువదియొకమాఱు నఱకి యంబరమునఁ బరమున కెక్కుసోపానసరణి
నిడి పితృప్రీతి తర్పణ మొత్తి యచల, నచలమతిఁ గశ్యపున కిచ్చినట్టిదేవ, చా.
దశరథాత్మజుఁడవై తపసివాసవనంబు పవనంబుఁ బ్రోచి పాషాణ మబలఁ
గావించి హరువిల్లు ఖండించి జనకుఁడు జనకుఁడై తనదు సీతను వరించి
గురునాజ్ఞ మునివృత్తిఁ దరుణితో యోగివై యోగివైఖరి భానుజాగచరుని
మైత్రి వాలిని ద్రుంచి మారుతిచరితంబు చరితంబుగా విని శరధిగట్టి
యసురులవధించిసతిఁగూడియాశ్రయువని, యువని శ్రీరామమూర్తివైనట్టిదేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౮
యదుకులంబునఁ బుట్టి యాభీరమందిర మందిరమందె చౌర్యములఁ దనరి
జారుఁడవై ధేనుసముదయావనకేళి వనకేళి గోపికావస్త్రవితతి
గొనిపూతనాది దుర్జననివారణముల రణముల నరుల దోర్బలము మించి
భక్తులఁ బాలించి బలరామమూర్తిని మూర్తినిమిత్తత మొదలొనర్చి
భీష్మకసుతాదికన్యలఁ బెండ్లియాడి, యాడిపాడుచునీలాద్రి నలరుదేవ, చారు.
తరువరాశ్వత్థప్రదక్షిణ కాంతలఁ గాంతలఁ దొలుదొల్తఁ గౌఁగిలించి
విధివత్సకలితగోవేషివై దానవదానవత్సాపామృతంబుఁ ద్రావి
సన్నద్ధరథ మద్రిజామనోహరునకు హరునకు నేర్పుగా నాచరించి
యతనితూపున నిల్చి యదరి మాపురులకుఁ బరులకుఁ దల్లడపాటొనర్చి
త్రిపురదైత్యసతిఁ గడతేర్చి యంత, నంతరితబుద్ధరూపుఁడవైనదేవ
చారుతరమందహాస పోలూరివాస, వారితామితతృష్ణ మన్నారుకృష్ణ. ౯౯

శ్రీరస్తు.

# హలన్తపరిచ్ఛేదము.

---

ప్రథమైకవచనతుల్యం సర్వత్ర హలన్త మగుణవత్ప్రభృతి
గుణవర్ణో ద్వితీయైకవచనతుల్యో భవే ద్వికృతౌ. ౧

ఇది రెండుసూత్రములు. అగుణవత్ప్రభృతి=గుణవర్ణవ్యతిరిక్తమైన, హలన్తం=హలన్తశబ్దజాతము, సర్వత్ర=ఈ తెనుఁగున నంతటను, ప్రథమైకవచనతుల్యం=సంస్కృతములోఁ ప్రథమైకవచన మెట్లుండునో యట్లు నిలుచును. ఉదాహరణములు ముందు చెప్పెదము. వికృతౌ=తెనుఁగునందు, గుణవర్ణః=గుణవత్ప్రభృతి, ద్వితీయైకవచనతుల్యః=సంస్కృతములోని ద్వితీయైకవచనము వంటిది, భవేత్=అవును.

---

ద్విత్వోత్వే సర్వహలాం హ్రస్వా ద్ద్విత్వన్తు దీర్ఘతో బహుళమ్
అగుణవతాం సర్వహలాం సోర్లోపో గుణవతాం డుమూ ప్రాగ్వత్. ౨

ఇది నాలుగుసూత్రములు. హ్రస్వాత్=హ్రస్వముమీఁదనున్నట్టి, సర్వహలాం=సమస్తమైన హలన్తములకును, ద్విత్వోత్వే=ద్విత్వమును, ఉత్వమును నగును. దీర్ఘతః=దీర్ఘముమీఁద నైనయెడల, ద్విత్వన్తు=ద్విత్వము, బహుళం=బహుళముగా వచ్చును, ఉత్వము రానే వచ్చును. అగుణవతాం=అగుణవత్ప్రభృతులైన, సర్వహలాం=సమస్తమైన హలన్తములకును, సోర్లోపః=ప్రథమైకవచనలోప మగును. గుణవతాం=గుణవర్ణములకు, డుమూ=డు, ము, అను నవి (డుకారముకారములు)-ప్రాగ్వత్=మొదటఁ జెప్పినట్లే వచ్చును. మహాత్ములకు, డు, అమహాత్ములకు, ము,—హకారాంతపుంలింగమైన అనడుహ్శబ్దము గుణవర్ణములోనిది గనుక, ద్వితీయైకవచనతుల్యమైనయెడల, అనడ్వాహం అని ద్వితీయైకవచనరూపము నిల్చెను. అమహాత్తు గనుక, ము, వచ్చిన, అనడ్వాహము. కడమరూపములు, అకారాంతములకువలెనే—అనడ్వాహములు, అనడ్వాహమునందు-ఇత్యాది. ఈలాగే దివ్శబ్దము, దివము. ఉపానహ్శబ్దము గుణవర్ణములోనిది గాదు గనుక, ప్రథమైకవచనతుల్యమైన, ఉపానత్ అని యుండెను. తకారము హ్రస్వము గనుక ద్విత్వోత్వములు వచ్చి "ఉపానత్తు" అని యుండెను. యాఁతము లేదు. రేఫాంతము పూర్శబ్దము గుణవర్ణము, పురము. ఈ తెనుఁగు లోకవ్యవహారదృశ్యము గనుక గీర్శబ్దము వ్యవహారము లేదు. అభిధానములవారు యాదవాదులు, అవ్యక్తలింగశబ్ద

ములు నపుంసకలింగశబ్దములుగాఁ జెప్పినారు కనుక, అవ్యక్తలింగ మైన కింశబ్దము నపుంసకలింగ ప్రథమైకవచనతుల్య మై కిమ్ము అని యుండెను. ప్రశాన్ శబ్దము దీర్ఘపరహల్లు గనుక ద్విత్వము రాదు. ప్రశానుఁడు. మహత్తు గనుక డుజ్ వచ్చెను.

---

ఆత్మన ఇమనన్తానాం డావా*దుస్స్యా త్సదా రాజ్ఞః
సాన్తా దపయః ప్రభృతేః స్లోపో న్యేషాంచ వా లుగన్త్యస్య. 3

ఇది నాలుగుసూత్రములు. ఆత్మనః=ఆత్మన్ఛబ్దమునకును, ఇమనన్తానాం=ఇమనిచ్ ప్రత్యయాంతములకును, డావా=డా యను వర్ణకము వికల్పమున వచ్చును. అన్యవన్న్యాయమున డాలోని డకారము లోప మై మిగిలిన ఆకారము టిలోపము చేసి నిల్చును. హ్రస్వము వచ్చిన, ఆత్మ యనురూపము మాఱెను. వికల్పము గనుక డా లేనప్పుడు, ఆత్మము. మహత్తుగా వివక్షించితేని, ఆత్ముఁడు. ఇమనంతములు- మహిమము, మహిమ, గరిమము, గరిమ, ఇత్యాది. రాజ్ఞః=రాజన్ శబ్దమునకు, సదా=నిత్యముగాను, డుస్స్యాత్=డువర్ణకము వచ్చును. ఇది డా వలెనే వచ్చునని రాజు. కకుప్ శబ్దము కకుప్పు. అగ్నిమత్ శబ్దము బహుళగ్రహణమున ద్విత్వము లేక అగ్నిమథుఁ డాయెను. వాక్ శబ్దమునకు వాకు, బహులోక్తివలన వాక్కు-అని యును గలదు. త్వక్ త్వక్కు. భవచ్ఛబ్దము లేదు. ధీమచ్ఛబ్దము గుణవర్ణనము- ధీమంతుఁడు, మతిమంతుఁడు, హనూమద్భగవచ్ఛబ్దములు కొందఱిమతమున గుణవర్ణనములు గావు, హనుమానుఁడు, భగవానుఁడు. హనుమంతుఁడు, భగవంతుఁడు-అనియుం గలదు. అప్ శబ్దమునకు, అప్పులు. దిక్ శబ్దమునకు దిక్కు. విద్వచ్ఛబ్దమునకు విద్వాంసుఁడు. అపయః ప్రభృతేః=పయః ప్రభృతివ్యతిరిక్తమైన, సాన్తాత్=సకారాంత శబ్దముమీఁద, స్లోపః=సకారలోపము వికల్పమున నగును- తేజము, యశము, మనము, తేజస్సు, యశస్సు, మనస్సు-ఇత్యాది. పయః ప్రభృతికి, సకారలోపము లేదు. పయస్సు వయస్సు, అయస్సు, సరస్సు-ఇత్యాది. అన్యేషాంచ=మఱికొన్ని హలంతములకును, అన్త్యస్య=అంత్యహల్లునకు, వా లుక్=వికల్పమున లోపము వచ్చును. జగము, జగత్తు. చకారప్రయోగమువలనఁ గొన్నింటి కంత్యాచ్చులకు వర్ణాంతరము వచ్చి యంత్యహల్లోప మగును. పథము.

---

* డుర్భవతి సర్వదా రాజ్ఞః.

ప్రాకృతభవసంస్కృతభవసంస్కృతవత్ప్రాకృతభవవికృతిభవాః
వ్యతిరిక్తా భూయాంసో వ్యతిరిక్తాస్సంప్రదాయతో వేద్యాః. ౪

ఈయార్యావృత్తము సంప్రదాయవేద్యము.

---

దేశ్యాదస్మద్యుష్మచ్ఛబ్దాత్సుజసో ర్నుమూ వురూ చస్తః।
న్నుమ్ము ప్రాస్వశ్చాదే రమిశశి చాన్యతరలుక్చ యుక్తస్య. ౫

ఇది రెండుసూత్రములు. దేశ్యాత్=తెలుఁగులైన, అస్మద్యుష్మచ్ఛబ్దాత్=అస్మద్ యుష్మత్ శబ్దములమీఁద, సుజసోః=ప్రథమైకవచనబహువచనములకు, యథాక్రమముగా, నుమూ=ను, ము, అను నాదేశములును, వురూ=వు, రు, అనునాదేశములును, స్తః=అగును. యుష్మదస్మచ్ఛబ్దములకుఁ దత్సమపుఁదెలుఁగు లేదు గనుక "దేశ్యాత్" అని దేశ్యతెలుఁగులే చెప్పుచున్నాఁడు. నా యనుమాట యస్మచ్ఛబ్దము, నీ యనుమాట యుష్మచ్ఛబ్దము, కనుక, అస్మచ్ఛబ్ద ప్రథమైకవచనమునకు ను వచ్చిన, "ప్రథమాయా మే దస్మదః" అను నుత్తరసూత్రప్రాప్తిని 'నేను' అనురూపమాయెను. బహువచనమందు ము వచ్చిన, నుత్తరసూత్రమున మకారము నేత్వమును వచ్చి "మేము". యుష్మచ్ఛబ్దమునకు వు వచ్చిన "నీవు". బహువచనమందు రు వచ్చిన నుత్తరసూత్రమున మకారము వచ్చి, "మీరు". అమిశశి చ=ద్వితీయైకవచనబహువచనములయందు, న్ను, మ్ము=న్ను, మ్ము, అను నాదేశములును, ఆదేః=మొదటియక్షరమునకు, ప్రాస్వశ్చ=హ్రాస్వమును వచ్చును. యుక్తస్య=సంయుక్తము లైన, న్నుమ్ములకు, అన్యతరలుక్చ=ఒకహల్లులోపమును నగును. నిన్ను, నిను; మిమ్ము, మిము; నన్ను, నను; మమ్ము, మము.

---

కిర్నబమః ప్రథమాయా మే దస్మద ఏతయో ర్బహుత్వే మః
హ్రాస్వే టాదా నమ వాశ ద్వయువ ద్వచనద్వయేన్యథా రాత్మా. ౬

ఇది నాలుగు సూత్రములు. బమః=షష్ఠికి- "బసః కిశ్చ" అని వచ్చెడు కి యాదేశము లేదు. యుష్మచ్ఛబ్దము, ఇకారాంతము గనుక నీ యనుదానికే యీవిధి. (నీయనుశబ్దమునకే యీనిర్ణయము) ప్రథమాయాం=ప్రథమయందు, అస్మదః=అస్మచ్ఛబ్దమునకు, ఏత్=ఏత్వము వచ్చును. ఏతయోః=ఈ రెంవుశబ్దములకును, బహుత్వే=బహువచనములయందు. మః=మకార మగును. నీచేత,

మీచేత; నీకొఱకు, మీకొఱకు; నీవలన, మీవలన; నీకు, మీకు; నీయందు, మీయందు; నాచేత, మాచేత; నాకు, మాకు- ఇత్యాది. ఆత్మా=ఆత్మశబ్దము, టాదౌ=తృతీయాదివిభక్తులయందు, హ్రస్వే=హ్రస్వ మగుచుండఁగా, నమవాన్=న,మ, యను నాగమములు గలది యౌను. వచనద్వయమునందును వరుసగా ననుట. అన్యయోః=ప్రథమాద్వితీయలయొక్క, వచనద్వయే=ఏకవచన బహువచనములయందు, ద్వయవత్=అస్మద్యుష్మచ్ఛబ్దములు రెంటివంటిది యు వరుసగా నగును. ఏకవచనమం దస్మచ్ఛబ్దమువంటిదియు, బహువచనమందు యుష్మచ్ఛబ్దము వంటిదియు నగు ననుట. అస్మచ్ఛబ్ద ప్రథమాద్వితీయైకవచనములకు నన్నులును యుష్మచ్ఛబ్ద ప్రథమాద్వితీయాబహువచనములకు మిమ్ములును వచ్చును. నుమ్ములయం దాదిహ్రస్వము వచ్చును. తా-ఆత్మశబ్దము. తాను, తాము, తన్ను, తమ్ము. తృతీయాదులయందు, హ్రస్వమును నమాగమములును వచ్చిన-తనచేత, తమచేత; తనకు, తమకు-ఇత్యాది.

---

భూయ ఉభయార్థవాచీ యః కశ్చి ద్భవతి నిత్యబహువచనః
తస్య జసో ము శసో లః ప్రాగ్వ త్సర్వం భిసాదికే న్యత్ర. ౭

ఇది యేకసూత్రము. భూయః=ఈయుష్మదస్మచ్ఛబ్దములు గాక- మఱియొకటి, ఉభయార్థవాచీ=ఆరెంటియర్థమును జెప్పెడి, నిత్యబహువచనః=నిత్యబహువచనమైనది, యః=ఏదైననేమి, కశ్చిత్=ఒకటి, భవతి=కలదు. తస్య=దానియొక్క, జసః=ప్రథమాబహువచనమునకు, ము=ము, అనునాదేశమును, శసః=ద్వితీయాబహువచనమునకు, లః=ల, అనునాదేశమును వచ్చును. భిసాదికే=తృతీయాబహువచనము మొదలయిన, అన్యత్ర=కడమవానియందు, సర్వం=సమస్తమును, ప్రాగ్వత్=యుష్మదస్మచ్ఛబ్దములకు వలెనే యగును. "మన" యనునది యుభయార్థవాచి. దానికి "ము" ఆదులు వచ్చిన, మనము, మనల, మనచేత-ఇత్యాది.

---

కవిభల్లటైః క్రియాణాం నామ్నాం చోల్లోప ఇష్యతే హ్యేషు
ప్రథమైకవచనమాత్రే విక్లతౌ నాన్తాదయోఽపి కథ్యన్తే. ౮

ఇది యేకసూత్రము. కవిభల్లటైః=కవిభల్లటులచేత (కవిభల్లటు లనఁగాఁ బురాతనకవులు, వా రొక లక్షణకర్తలు) క్రియాణాం=ధాతువులకు ను, నామ్నాం చ=శబ్దములకు ను, ఉల్లోపః=ఉకారలోపము, ఇష్యతే=ఇచ్ఛయింపఁ

బడుఁగదా (చెప్పినా రనుట) చూతుర్, చూతురు, ఇత్యాది క్రియలయందు, రేఫలమీఁది యుత్వములకును, కన్ను, మన్ను, మిన్ను, మున్ను, ఇత్యాదిశబ్దముల యం దుత్వములకును లోపము. ఏషు=ఈలోప ప్రదేశములయందు, వికృతౌ= అచ్చతెనుఁగున, నాన్తాదయోపి=నకారాంతాదిశబ్దములు ను, ప్రథమైకవచన మాత్రే=ప్రథమైకవచనమందే, కథ్యన్తే=చెప్పఁబడును. "కన్నుదెఱచి" యన్న చోట భల్లటునిమతమున, ఉకారలోపమైన నకారాంతమై యుండును. కన్దెఱచి, చన్గుడిచి—రాంతములు, పేర్వాడి, గోర్గోపి. క్రియలకుఁ గ్రియాపరిచ్ఛేదము లో స్పష్టము. మెత్తుర్గనులు, చూడర్గనులు—ఇత్యాది నాన్తాదయః అని యాదిశబ్దముచేత లాంతములును; కల్గాని, విల్వాని. ప్రథమైకవచనము తప్పిన, ఉకారాంతాది-కన్నులు, కంటిచేత.

---

ఇద మద సేత ద్యత్త చ్ఛబ్దా శ్శబ్దాన్తరాన్వయే బహుళమ్

హ్రస్వం ప్రపద్య దీర్ఘా ద్విత్వ ముపర్యక్షరస్య జనయన్తి. ౯

ఇది యేకసూత్రము. శబ్దాన్తరాన్వయే సతి=మఱియొకశబ్దముతో నన్వయము కలిగి యుండఁగాను, ఇదమ్, అదస్, ఏతద్, యద్, తద్, శబ్దాః=ఈశబ్దముల, దీర్ఘాః=దీర్ఘములు, హ్రస్వం ప్రపద్య=హ్రస్వమును బొంది, ఉపర్యక్షరస్య=ఆశబ్దముయొక్క మొదటి యక్షరమునకు, బహుళమ్=బహుళముగాను, ద్విత్వమ్=ద్విత్వమును, జనయన్తి=పుట్టించును. ఇదం శబ్దము=ఈదేశము, ఇద్దేశము; తద్ శబ్దము-ఆకాలము, అక్కాలము; అదస్, ఏతద్ శబ్దములకు నివియే రూపములు. యచ్ఛబ్దము-ఏదేశము, ఎద్దేశము-బహులోక్తివలన, ఆరాజు, ఈసేన, యనుచోటులను రాదు. శబ్దాంతరము లేకున్నను- ఏది, ఎద్ది-యనుచోట వచ్చును. అ- అజాతిశబ్దముతో నన్వయించినప్పు డాయచ్చును లఘుయకారము చేసికొని దానికి ద్విత్వము చేసికొనునది. అయ్యార్యుఁడు, ఇయ్యుత్తముఁడు.

---

ది స్సాన్య త్సమ్బన్ధార్థే సర్వస్మా ద్యుష్మదస్మదా స్త్వర్థః

ద్వతి *వర్ణకో ఽ ఇదు స్త్రీవిషయా స్త్వర్థే తనశ్చ వికృతౌ స్యాత్. ౧౦

ఇవి నాలుగుసూత్రములు. సర్వస్మాత్=సకలనామములమీఁదను, సమ్బన్ధార్థే=సంబంధార్థమందు, దిః=దివర్ణకము, స్యాత్=అగును. వర్ణక మనంగాఁ బ్రత్యయము. రాజుది, పులిది, బంటుది, మేఁకది- ఇత్యాది. యుష్మదస్మద్భ్యః=ఈమూఁటిమీఁదను, ద్వతివర్ణకః=దు అనువర్ణక మగును. నాదుసొమ్ము.

* వర్ణకోయఇ స్త్రీవిషయాః- పా.

సీదు తేఁగ, తపదుక్రీర్తి. అ, ఇ, ఉ=ఈమూఁడును, స్త్రీవిషయాః=స్త్రీనామములమీఁద వచ్చు వర్ణకములు- గార, గారి, గారు. స్త్రీవిషయములయందె, తెలుఁగు స్త్రీలింగములమీఁద వచ్చు నవి యు ననవచ్చును. ముంత, పడి, తూము-స్త్రీసమములు చేసికొని సులోకముఁ దెచ్చుకొనునది. సర్వత్ర యిట్లే- వికృతౌ=తెనుఁగునందు, త్వార్థే=త్వ ప్రత్యయార్థమునందు, తనః=తనవర్ణకము, స్యాత్=అగును దొరతనము, దొడ్డతనము.

---

నామ్నః కవర్ణక స్స్యా త్స్వార్థే స్యా దుత్వ మపి పరే తస్మిన్
చు రితి క్రియాపదానాం సర్వేషాం వర్తమానకాలే స్యాత్. ౧౧

ఇవి రెండుసూత్రములు. నామ్నః=నామమునకు, స్వార్థే=స్వార్థమందు, కవర్ణకః=కవర్ణకము, స్యాత్=అగును. తస్మిన్ పరే=అది పరమై యుండిన, ఉత్వ మపి స్యాత్=పూర్వాక్షరమున కుకారమును వచ్చును. పొలఁతి, పొలఁతుక; గొంతు, గొంతుక; విప్పు, విప్పుక; మెలఁత, మెలఁతుక-ఇత్యాది. సర్వేషాం=సర్వమైన, క్రియాపదానాం=క్రియలకు, వర్తమానకాలే=వర్తమానార్థమందు, చురితి=చు అనువర్ణకము, స్యాత్=అగును, ఘటించుచున్నాఁడు, గెలుచుచున్నాఁడు. ఇత్యాది.

---

ప్రతిషేధవాదినాం నిః భూతార్థానాంతు నః క్రియాణాం స్యాత్
కర్త్రాదేః కర్తృత్వం ప్రథమాచ నవర్ణక శ్చ తద్వ త్స్యాత్. ౧౨

ఇది మూఁడుసూత్రములు. ప్రతిషేధవాదినాం=ప్రతిషేధమును జెప్పుచున్న, క్రియాణాం=క్రియలకు, నిః=నివర్ణకము- ఘటింపనివాఁడు, చూడనివాఁడు; భూతార్థానాంతు=భూతార్థములకు, నః=నవర్ణకము, స్యాత్=అగును. కర్త్రాదేః=కర్త్రర్థము మొదలైనవానికి, కర్తృత్వం ప్రథమాచ=కర్త్రర్థకమును ప్రథమయు-నవర్ణకశ్చ=నవర్ణకమును వచ్చును. నీవు నుతించిన రాజు. ఇది కర్త్రర్థకము. నీచేతఁ బొగడఁబడిన రాజనుట. నీచేతనను తృతీయకుఁ బ్రథమవచ్చును. నుతింపఁబడిన యను కర్మార్థమునకుఁ గర్తృత్వము వచ్చెను. కర్త్రాదేః అను నాదిశబ్దముచేత, అధికరణార్థములయందు నిట్లిలాగున నే వచ్చును. నే భుజించినచోటు, నీవు గెల్చినవాఁడు ఇత్యాద్యర్థభేదములు తెలిసికొనునది.

---

షష్ఠీ ధవే ద్వితీయాతుల్యా తత్పురష సంస్థితానామ్నాన్
ఇ దుపోత్తమోత్తమానాం బహువచన ఉపోత్తమేత ఉద్భవతి. ౧౩

(గ్రంథపాతము రెండు ప్రతులలోను)... ఇదుపోత్తమోత్తమములు–బలుములు, కలుములు, చెలుములు, అయెను. రెండవ యుకారము, ఉద్బహుత్వే యని వచ్చినది. ఇట్టిలాగుననే వెలుములు, మెలుములు మొదలైనవి. ఇది ప్రాయికలక్షణము. అటుగనుక, ఇరులు, విరులు- ఇత్యాదిస్థలములందు లేదు. ప్రాయిక నిత్యలక్షణముల ప్రకారము లిట్టిలాగుననే తెలియునది.

---

అస్మద్యుష్మద్వాచ్యా దేకత్వ ఇతో నివీ పరేషాంతు
ధర్మోత్తమమధ్యమవ ద్బహుషు న మధ్యమవ దుతోచ్చ సర్వేషు. ౧౪

ఇది నాలుగుసూత్రములు. అస్మద్యుష్మద్వాచ్యాత్ =అస్మద్యుష్మచ్ఛబ్దములచేత వాచ్యములయిన, ఇతః=ఇకారాంతమునకు, ఏకత్వే-ఏకత్వమందు, నివీ=ని, వి, యనువర్ణకము లగును, నేను గవిని, నీవు పతివి. కవిశబ్ద మస్మద్వాచ్యము, పతిశబ్దము యుష్మద్వాచ్యము. పరేషాంతు=ఇకారాంత వ్యతిరిక్తములకు, ధర్మోత్తమమధ్యమవత్ =క్రియలకు ధర్మ మను గర్థమందు వచ్చెడి యుత్తమపురుష మధ్యమపురుషల కేదో యది వచ్చును. ను వు అనువర్ణకము లవు ననుట. నేను భక్తుఁడను, నీవు దేవుఁడవు. బహుషు=బహువచనములయందు, మధ్యమవత్ =మధ్యమపురుషవంటిది, న=కాదు. ప్రథమోత్తమపురుషలవంటిదౌను- ము రు అనువర్ణకము లౌ ననుట. మేము భక్తులము, మీరు దేవతలరు. బహుషు అను బహువచన ప్రయోగమువలన, ఇకారాంతములకు ను బహువచనమందు ము, రు, వర్ణకములు వచ్చును. మేము కవులము, మీరు స్వాములరు. సర్వేషు=ఈచెప్పిన ను, ము, వు, రు, అను వన్నియుఁ బరమై యుండిన, ఉతః=అంత్యమైన ఉకారమునకు, అచ్చ=అకారమును వచ్చును. భక్తుఁడు అను నంత్యోకారమునకు నుమువురులు పరమైనప్పుడు, అకారము వచ్చిన- భక్తుఁడను-భక్తుఁడవు, ఇట్టిలాగే భక్తులము, భక్తులరు-అని యుండును. కవిని అను చోట ఉకారము లేదు గనుక, అకారము రేదు. కవులము అనుచోట, కవులు అను నుకారమునకు అత్వము వచ్చును. సూత్రములో నస్మచ్ఛబ్దము పూర్వనిర్దిష్ట మైనను గాని వ్యవహార ప్రధానము యుష్మచ్ఛబ్దము గనుక ప్రథమపురుషవంటి దాయెను. సర్వేషు అన్నాఁడు గనుక క్రియలయొక్క ఉకారమునకును, అకారము వచ్చును. పొగడుచున్నాఁడను, ప్రోచుచున్నాఁడవు. ఇత్యాది- జవరాలవు, ముద్దరాల వనుచోటను గూడ నిట్టిలాగే అకారము తెలియునది.

---

సర్వవిభక్తి స్సంస్కృతతుల్యా స్యన్యాః క్వచి ద్భవే చ్చాన్యా
ఏకత్వం భేదకగతబహువచనానాంచ దృశ్యతే వికృతౌ. ౧౭

ఇది మూఁడు సూత్రములు. సర్వవిభక్తిః=ప్రథమాది విభక్తు లన్నియు, సంస్కృతతుల్యాః=సంస్కృతమం దేయేస్థానమున నేయేవిభక్తి వచ్చునో యటువలెనే యిందును వచ్చును. పొడవు, కొంచెము, కృష్ణుండు, తూము, ఇత్యాది ప్రాతిపదికార్థములయందుఁ బ్రథమ—హరిఁ దలఁచెద, అంబఁ గొలిచెద, నిత్యాదిస్థలముల ద్వితీయ—శూలముచేతఁ బొడిచె, సురలచేత నుతింపఁబడియె నిత్యాదికర్తృకరణములఁ దృతీయ—ద్విజులకొఱకు దక్షిణ, కవులకొఱకు పాయస మిత్యాది సంప్రదానములఁ జతుర్థి—గిరివలన వెడలెను, కరివలన వెలసెను, ఇత్యాద్యపాదానమునఁ బంచమి—దొరకు హితుఁడు, నూటికన్నను, ఇత్యాది సంబంధముల షష్ఠి—కంచియం దుండును, కవితయందు నేర్పరి, ఇత్యాద్యధికరణముల సప్తమి—అంబ ననుఁ బ్రోచవే, అవ్వ పిరు లీయవే, ఇత్యాదుల సంబుద్ధి. ఇట్లు విభక్తులు తెలియునది. అన్యస్యాః=ఒకవిభక్తి, క్వచిత్=ఒకానొకచోట, అన్యాచ=మఱియొక విభక్తియును, భవేత్=అగును, విప్రులకు దానమిచ్చెను-చతుర్థీస్థలమున షష్ఠి—శిరమున గురుపాదుకలు వహించె- తృతీయాస్థలమున సప్తమి—రాముఁ డరణ్యమేఁగె-అరణ్యమున కనుదానికరణ్యము. షష్ఠీస్థలమునఁ బ్రథమ—సుఖమేగి, కాశినుండురు, తృతీయాస్థలమునఁ బ్రథమ. ఇత్యాదులు ప్రయోగవశమునఁ దెలియునది. వికృతౌ=తెనుఁగునందు, భేదకగతబహువచనానాం=విశేషణములయొక్క బహువచనములకు, ఏకత్వంచ=ఏకవచనమును, దృశ్యతే=కనఁబడును. ఇంపైనప్రియురాండ్రు, ఒప్పైనసిరులు-సొంపైనవిద్యలు.

---

## —॥ ఇతః పరస్సమాసనిర్ణయః ॥—

ద్విగుకర్మధారయౌ తత్పురుషద్వన్ద్వౌ బహువ్రీహిః
అన్యే చ కేచి దుపమానోత్తరపదలోపరూపకాఖ్యాద్యాః ౧౮
పరిదృశ్యా ఇహ కార్యా లోపవిభక్తికవ దన్త విధయశ్చ
లోపశ్చ విభక్త్యాదే శ్శబ్దేషుస్యా త్సమాసకాన్తేషు. ౧౯

ఇది యార్యాయుగ్మము. ద్విగుకర్మధారయములు, తత్పురుషద్వంద్వములు, బహువ్రీహి, ఉపమానము, ఉత్తరపదలోపము, రూపకము మొదలైనవి. అన్యేచ=తక్కినవి, కేచిత్=మఱికొన్ని సమాసములును, ఇహ=తెనుఁగునందు, పరిదృశ్యాః=చూడఁదగినవి.